# విశ్వప్రకాశం

## ఆధ్యాత్మికమాసపత్రిక

శ్రీయువనామ సం. శ్రీరామకృష్ణపరమహంస, మహాశివరాత్రి ప్రత్యేకసంచిక
ఫిబ్రవరి **1996**

సంపుటి : **2** | సంచిక : **4** | వెల రూ. **5-00**



*ప్రకాశకులు*
సర్వార్థ సంక్షేమ సమితి
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్,
గాంధీనగర్, హైదరాబాద్.

*ఈ సంచికలో........*

## సంపాదకీయం

# శ్రీరామకృష్ణ పరమహంస

నవీన భారతదేశ చరిత్ర అత్యంతవిస్మయావహమైనది. మనపూర్వులు చెప్పినట్లు భారతదేశం దేవతలకు కూడా విమోహపాత్రమైనది. ఈదేశంలో నదీనదాలు పుణ్యక్షేత్రాలు ఇంకా తమ ప్రాభవాన్ని కోల్పోలేదు. ప్రభావాన్ని పోగొట్టుకోలేదు. భూదివమ్ములనొకటి చేయటం, స్వర్గమును భూమిమీదకు ఆకర్షించటం భారతదేశంలో ఇంకా సాధ్యమేనని ఇప్పటికీ నిరూపణం

సరిగ్గా నూట అరవై సంవత్సరాల కిందట ఇటు వంటిదే ఒక సంఘటన జరిగింది. అది శ్రీరామకృష్ణ దివ్యావతార ఆవిర్భావం పశ్చిమవంగదేశంలో కామర్పకూర్ అనే చిన్నగ్రామం ఉంది. అది కాశీనుంచి పూరీ జగన్నాథక్షేత్రానికి వెళ్ళేత్రోవలో ఉంది. ప్రకృతి సౌందర్యానికి ఆటపట్టు ఆగ్రామం. 1836వ సంవత్సరం ఫిబ్రవరి 17వ తేదీ అర్ధరాత్రి దాటిన తర్వాత అంటే తెల్లవారితే 18వ తేది అనగా గదాధరుడు జన్మించాడు. తండ్రి గయను సందర్శించి గదాధరుణ్ణి సేవించిన తర్వాత ఆ పిల్లవాడు పుట్టాడు కాబట్టి గదాధరుడని పేరు పెట్టుకున్నారు. గదాయ్ ఇరుగు పొరుగుకూ, ఊరివారందరికీ ముద్దుమురిపెంగా పెరిగాడు. చిన్నప్పటి నుంచీ ఆ పిల్లవాడికి బైరాగులతో సావాసం. ఉపవాసాలంటే ఇష్టం. పూజలు భజనలు అంటే పరమానందం.

అన్నగారు కలకత్తాలో సంపన్నులింట దేవతార్చన చేయడానికి వెళుతూ తమ్ముణ్ణి కూడా బయలు దేరదీశాడు. అప్పటికి గదాధరుడు పదహారు పదిహేడేళ్ళ చిన్నవాడు. అన్నగారు స్థితిమంతులైన ఇళ్ళలో దేవతార్చన నిర్వహిస్తూ ఉండగా తమ్ముడాయనకు తోడ్పడే వాడు. ఆరోజుల్లో రాణీరాసమణి కలకత్తా సమీపంలోని దక్షిణేశ్వరంలో గంగ ఒడ్డున కాళికొక ఆలయం నిర్మించాలని తలపెట్టింది. ఆతర్వాత ఆదేవాలయంలో పూజారినియామకం ఆమెకు ఒక సమస్య అయింది. గదాధరుడి అన్నగారు శ్రీరామకుమార్ అందుకు ఒప్పుకోవడంతో ఆమె పూర్వపుణ్యాం ఫలించింది. మహావైభవంగా దేవాలయ సంప్రోక్షణం, దేవతా విగ్రహ ప్రతిష్ఠ జరిగాయి. శ్రీకాళీమాత ప్రతిష్ఠతోపాటు గోవర్ధనోద్ధారి, శ్యామసుందరుడు, మురళీగాన విలోలుడైన శ్రీకృష్ణుడికి దేవాలయం, ఇంకా పన్నెండు శివాలయాలు ఆ ప్రాంగణంలోనే రాణీరాసమణి నిర్మింపచేసింది. అన్నగారు శ్రీ కాళికాదేవి అర్చకుడిగా

నియుక్తుడు కాగా, గదాధరుడు గోపాలదేవుని పూజారి అయినాడు.

తర్వాత రామకుమార్ మృతితో గదాధరుడే కాళికాదేవి ఆలయార్చకుడైనాడు. కాళికాదేవి నాయన అర్చావిగ్రహమని కాకుండా సచేతన మూర్తిగానే భావించి షోడశోపచార పూజలు నిర్వహించేవాడు. ఆమెతో మాట్లాడేవాడు. ఆమె ముందు పసిబాలుడిలా అలిగేవాడు. ఆమె చేత నివేదితాన్నం భుజింపచేసేనాడు. ఆలయావరణంలోని 'పంచవటి' అనే వివిక్త ప్రదేశంలో తపస్సు చేసేవాడు. అది పరమసుందరమైన వనాంతర్భాగం. అక్కడ ఆమలకం, బిల్వం, న్యగ్రోథం, పిప్పలం, ప్లక్షం అంటే ఉసిరి, మారేడు, మర్రి, రావి, జువ్వి చెట్లు వ్యాపించి రమణీయ తపోవన భూమిని రూపొందించాయి. అర్ధరాత్రులలో ఇక్కడ కాళికాలయ పూజారి తపస్సు చేసేవారు.

ఇట్లా ఉండగా ఒక రోజున గంగ ఒడ్డున ఆలయపూజారి కూర్చుని ఉండగా గంగానదిలోని ఒక పడవనుంచి దృఢకాయుడైన ఒక సన్యాసి దిగి రేవుమెట్లు ఎక్కివచ్చి గదాధరుణ్ణి చూశాడు. చూడగానే ఆకర్షితుడైనాడు. ఆయువకుడు బ్రహ్మజ్ఞానసముపార్జనకు అన్నివిధాలా అర్హుడని భావించాడు. నీకు సన్యాసదీక్ష ఇస్తాను తీసుకుంటావా?అని అడిగాడు. 'అమ్మ అనుజ్ఞ కావాలి' అన్నాడాయువకుడు. అమ్మ అంటే ఆయువకుడి కన్నతల్లి అనుకున్నాడు ఆపరివ్రాజక శ్రేష్ఠుడు. ఆమె జగజ్జనని, భవతారిణి, కాళీమాత అని ఆయన ఊహించలేక పోయాడు. ఆసన్యాసి పేరు తోతాపురి. నాగ సంప్రదాయానికి చెందినవాడు. దిగంబరుడు. ఘోరారణ్యాలలో తపస్సుచేసి నలభై సంవత్సరాలు సాధన చేసి అద్వైతసిద్ధిని పొందిన వాడాయన. ఆయనే కాళీమాత దివ్యపుత్రుడైన శ్రీరామకృష్ణులకు సన్యాసదీక్షనిచ్చి బ్రహ్మజ్ఞానం ఉపదేశించాడు. బహుశః ఆయనే శ్రీరామకృష్ణనామం గదాధరుడికి అను గ్రహించి ఉండవచ్చు. తదాదిగా అజ్ఞాన శోకోపహతమైన జగత్తుకు ఆయన, ఆ రామకృష్ణుడు, యుగావతారుడు, భారతదేశానికి వివేకానందుణ్ణి ప్రసాదించినవాడు, గొప్ప వెలుగు చూపాడు. తన గురువు తోతాపురి నలభై సంవత్సరాలకు సాధించిన తపస్సిద్ధిని రామకృష్ణులు మూడురోజులలో సాధించారు.

శ్రీరామకృష్ణ పరమహంస జీవిత లీలలు అత్యద్భుతం. ఆయన దివ్యగాథలు సకల మానవాళికి అజ్ఞానాంధకార కరదీపికలుగా భాసించాయి. సమస్త జగత్తు ఆయన దివ్యావతారం ముందు మోకరిల్లింది. పసిపిల్లలకు సైతం బోధపడే ఉపమానాలతో గాథలతో చిన్నచిన్న పిట్టకథలతో ఆయన జ్ఞానోపదేశం చేశాడు. భక్తి జ్ఞానకర్మమార్గాలు మూడింటిని ఆయన సరళతరం చేశాడు. మతాల కొట్లాటలు వద్దన్నాడు. భక్తి శ్రద్ధలతో తిరుగులేని విశ్వాసంతో

ఏ మతాన్ని ఆశ్రయించినా అది సత్యసాధనకు ఆలంబనం అవుతుందన్నాడు. ఒక మంచి నీటి సరస్సు చుట్టూ ఎన్నో పానఘట్టాలుండవచ్చు ఏరేవున మెట్లు దిగినా ఆకొలను నీటినే కడవల్లో ముంచికొన్నట్లు, దాహశాంతి పొందినట్లు నిర్మల చిత్తంతో విశ్వాసంతో గాఢమైన అంకిత భావంతో భగవంతుణ్ణి ఉపాసిస్తే ఆయన అనుగ్రహం లభిస్తుందని శ్రీరామకృష్ణులు ప్రబోధించారు.

అప్పట్లో భారతదేశంలో బ్రహ్మ సమాజం, ఆర్యసమాజం మొదలైన విగ్రహారాధన వ్యతిరేకమత సంస్కరణోద్యమాలు సాగుతుండేవి. శ్రీరామకృష్ణ పరమహంస భారతీయమత సంస్కృతికి విగ్రహారాధన త్యాజ్యంగాదని నిరూపించారు. అవశ్యము అది ఆచరణీయమే, కర్తవ్యమే అని స్వీయ మహిమానుభావం ద్వారా లోకానికి వెల్లడించారు. ప్రపంచ సారస్వతవేత్తలలో అగ్రగణ్యులైన మాక్సుముల్లర్, రోమారోలా వంటివారు శ్రీరామకృష్ణుని దివ్యగాథను 'కీర్తించారు. ఆధునిక భారతదేశంలో వివిధ భారతీయభాషలలో శ్రీరామకృష్ణుల జీవిత చరిత్రలు వచ్చినన్ని మరి ఏ ఇతర ప్రముఖవ్యక్తిని గురించీ వెలువడలేదనటం సత్యదూరం కాదు.

శ్రీరామకృష్ణులు ప్రపంచానికి ప్రసాదించిన దివ్యానుగ్రహం శ్రీ వివేకానందస్వామి. శ్రీస్వామివివేకానంద1893లో అమెరికాలోని చికాగోలో జరిగిన ప్రపంచమత మహాసభలో హిందూమత ఉత్కృష్టతను సాధికారంగా సంస్థాపించాడు. భారతదేశంలో శ్రీరామకృష్ణమిషన్, శ్రీరామకృష్ణమఠం స్థాపించి వాటికి అంతరాతీయమైన వ్యవస్థను రూపొందింపజేశాడు. ముప్పైతొమ్మిది సంవత్సరాల లేతవయస్సున హఠావుడిగా స్వర్లోక ధామానికి ఆయన వెళ్ళి పోయినా భారతదేశం ఆయన దివ్యబోధల వల్ల, కర్మానుష్ఠానం వల్ల పునరుజ్జీవితమైంది.

ఇవాళ అంతర్జాతీయంగా దేశీయంగా శ్రీరామకృష్ణమఠం శ్రీ రామకృష్ణమిషన్ సంస్థలు సంఘసేవ, ఆధ్యాత్మిక ప్రబోధం నిర్వహిస్తున్నాయి. ఇటీవల శ్రీరామకృష్ణ పరమహంస శతవర్ధంతి ఉత్సవాలు పశ్చిమ బెంగాల్‌లో ఘనంగా జరిగాయి. కనీవినీ ఎరుగని రీతిలో ఆయన గూర్చిన గ్రంథాలు కోట్ల ఆదాయాన్ని సృష్టించాయి. వంగవాసులందరూ ఆయనను హృదయాలలో పునః ప్రతిష్ఠించుకున్నారు.

శ్రీరామకృష్ణ పరమహంస160వ జయంతి సందర్భంగా విశ్వప్రకాశం తన మొక్కులను ఆ పరమయోగీశ్వరుడికి చెల్లిస్తున్నది.

శ్రీరామకృష్ణ జయ

**

# మహాశివరాత్రి

శ్రీ అక్కిరాజు రమాపతిరావు

భారతీయ మతధార్మిక ఐతిహాసిక పురాణవాఙ్మయంలో పరమశివుడిస్థానం నిరుపమానం అష్టాదశపురాణాలలోకూడా శివ పారమ్యాన్ని ప్రతిపాదించేవే ఎక్కువ. యుగయుగాలుగా వేల సంవత్సరాలుగా పరమశివుడు భారత దేశంలో సంపూజితుడవుతున్నాడు. వారణాసి వంటి పుణ్యక్షేత్రం భారతీయులకు మరొకటి లేదు. అవి ముక్తమనీ, ముక్తిక్షేత్రమనీ, ఆనంద కాననమని కాశిభారతీయులకు ప్రస్తుతి పాత్రమైంది.

అతి ప్రాచీన కాలంనుంచీ భారతదేశంలో ద్వాదశ జ్యోతిర్లింగాలు ప్రసిద్ధమైనవి. అవి సౌరాష్ట్రంలో సోమనాథుడు, ఉజ్జయినిలో మహాకాళేశ్వరుడు, శ్రీశైలంలో మల్లికార్జునుడు, ఓంకార క్షేత్రంలో అమరేశ్వరుడు, పర్లీవైద్యనాథంలో వైద్యనాథుడు, జున్నారుదరి పుణ్యక్షేత్రంలో భీమశంకరుడు, రామేశ్వరంలో రామేశ్వరుడు, దారుకావనంలో నాగేశుడు, కాశిలో విశ్వేశ్వరుడు, గౌతమిపుట్టిన చోట త్ర్యంబకేశ్వరుడు, హిమాలయసాను సీమలలో కేదారేశ్వరుడు, ఎల్లోరాలో ఘుసృణేశ్వరుడు

మహాశివరాత్రికి ఈక్షేత్రాలన్నిటా భారతదేశంలో భక్తులు పరమ శివుణ్ణి సేవించుకుంటారు ఉపవాసాలుండి తీర్థ స్నానాలు చేస్తారు. ఇది వేల సంవత్సరాలనుంచి కొనసాగుతున్నవిశ్వాసం

భారత దేశంలో తెలుగు వారికి శివుడు మరింత ఇష్టదైవం. తెలుగు వారి దేశానికి త్రిలింగదేశమని పేరు. తెలుగు వారు తమ అక్షరాభ్యాసాన్ని 'ఓం నమః శివాయ'తో ప్రారంభిస్తారు పూజ్యపాదులు కంచికామకోటి పీఠ పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములు వారు తెలుగు వారికి శివభక్తి ఉగ్గుపాలతోనే సంప్రాప్తమని ప్రస్తావించారు. తెలుగు నాట పంచారామాలున్నాయి. శ్రీశైలం కాళహస్తి, వేములవాడ, కాళేశ్వరం, దాక్షారామం, అమరావతి, కోటప్పకొండ, విజయవాడ గొప్ప శివక్షేత్రాలు. తెలుగులో మహాభారతంతో పాటే బసవపురాణం, పండితారాధ్య చరిత్ర వంటి శివ పారమ్య ప్రతి పాదకాలైన దేశీయరచనలు వచ్చాయి. అరణ్య పర్వంలో నన్నయ్యగారి మహేశ్వరస్తుతి దండకరూపంతో పరమమనోహరంగా ఉంటుంది. ధూర్జటిశ్రీకాళహస్తీశ్వరమహాత్మ్యం పరమసుందరమైనకావ్యం.

అసలింతకూ మహాశివరాత్రి విశిష్టత ఎటువంటిది? అంటే ఇది మాఘకృష్ణ చతుర్దశినాడు సంభవిస్తుందని భారతీయుల విశ్వాసం. ఈ తిథినాడు అర్థరాత్రివేళ ఈశ్వరుడు నైమిత్తిక ప్రళయానంతరం లింగరూపుడై పునస్సృష్టికి ఉపక్రమించడమే ఈ సంఘటన విశిష్టత. అందువల్ల దీనిని మహాపర్వదినంగా పరిగణించి తీర్థ సేవనం, ఉపవాసవ్రతాదులతో భక్తియుక్తంగా భారతీయులు జరుపుకుంటారు. 'జన్మానికల్లాశివరాత్రి' అని తెలుగులో ఒక నానుడికూడా ఉంది. పరమశివుడు భక్తివశంకరుడు. భోళాశంకరుడు. జ్ఞానప్రదాత, భవభయహరుడు. మృత్యుంజయుడు, సదాశివుడు, అష్టమూర్తి, అఖిలలోకారాధ్యుడు, ఆయనను ఆరాధించే పరమ పవిత్రమైన పర్వదినం మహాశివరాత్రి.

ఓం నమస్తేఅస్తు భగవన్ విశ్వేశ్వరాయ, మహాదేవాయ
త్ర్యంబకాయ, త్రిపురాన్త కాయ, త్రికాలాగ్నికాలాయ,
కాలాగ్నిరుద్రాయ, నీలకంఠాయ, మృత్యుఞ్జయాయ,
సర్వేశ్వరాయ, సదాశివాయ, శ్రీమన్ మహాదేవాయనమః

ఇది నమకములోని మహామంత్రము. సర్వజగత్తును రక్షించుగాక.

# శ్రీ రామకృష్ణ పరమహంస దివ్య భాషణములు

సేకరణ: అక్కిరాజు రమాపతిరావు.

*తడికర్ర నిప్పు మీద వేసిన పక్షమున వెంటనే తడియిగిరి పోవును, అప్పుడా కర్రకాలనారంభించును. అలాగే పుణ్యాత్ముల సహవాసము లౌకికులగు స్త్రీ పురుషుల హృదయముల నుండి కామక్రోధములని యెడు తడ భాగముల నెండ జేయును. అంత వివేకాగ్ని వాటిని వెలిగించును.

*ప్రశ్న : స్త్రీ గాని పురుషుడుగాని తన జీవితకాలమెట్లు గడప వలయును?

సమా : కంసాలి కుంపటి మీదినిప్పులారి పోకుండ శ్రవణముతో నిప్పులు మాటికి మాటికి కదుపునట్లు మనస్సు సజ్జన సహవాసముచే పలుమారు ప్రదీప్తమగు చుండవలెను.

* నీటితో దడిపిన పిండిముద్ద రొట్టెగా జేసివేడినేతిలో బడవేయుము. అదిగుడగుడ మని ధ్వని జేయును. అదివేగిన పిదప గుడగుడ శబ్దము కొంచెమైన నుండదు. అట్లే మనుష్యుడు మిడిమిడి జ్ఞానము గలిగినప్పుడు ఉపన్యాసము లిచ్చుటకు, మతబోధ జేయుటకు బోయలుదేరును. కాని జ్ఞానము సంపూర్ణముగా లబ్దమైన తర్వాత నతడు వ్యర్థాడంబరములు మానును.

*ప్రపంచసంబంధములైన యాకర్షణల నడుమ కాపరం చేస్తూ వాటిచే భంగపడకుండా ఎవ్వడూ పరిపూర్ణత బడయునో అతడే మహాశూరుడు.

*కమ్మరివాడు తన కొలిమి ఆరిపోకుండా ఉండటానికీ మండటానికీ నడుమ నడుమ తిత్తితో గాలి పోసి నిప్పులు రగుల్కొల్పినట్లు మనస్సును నడుమ నడుమ సజ్జన సహవాసము చేత వెలయించు చుండవలయును.

*నిత్యమైన జ్ఞానమయమైన ఆనందమని యెడి మహా సముద్రమున మనము మునుగ వలెను. ఆకామక్రోధములని యెడి భయంకర జలచరములకు వెరవకుము. వివేక వైరాగ్యములనియెడి పసుపుముద్దలు మేని నిండబూసుకొని యాసముద్రమున మునుగుము. ఆజలచరములకి పసుపు వాసన గిట్టదు కాబట్టి అవి నీజోలికిరావు.

*పాపాకర్షణముండునట్టి తావులకు నీవు పోవలసి వచ్చినప్పుడు అట్టి చోటులు నీవు జొచ్చు వేళ జగన్మాతయైన దేవిని దలచు కొనుము. ఆమే నీ హృదయమునందు దాగియున్నదుస్తంత్రముల నుండి సహితము నిన్ను రక్షించును. తల్లి యెదట సిగ్గు లేక నీవు దుష్కార్యములు

జేయగలుగుదువా?

*ప్రశ్న : భక్తు లేదుస్తులు ధరింపవలయును?

సమా: తగిన దుస్తులు ధరించుట మంచిది. సన్యాసి ధరించు కాషాయ వస్త్రములు గట్టువాడును భిక్షుకుడు ధరియించు తంబురా చిరుతలు దాల్చువాడును బూతు మాటలాడజాలడు. బూతు పాటలు పాడజాలడు, తేలిక పలుకులు పలుక జాలడు. కాని వన్నెల విసనకర్రవలె డాబు దుస్తుల ధరించువాడు నీచాలోచనలు జేయుచు నీచపుమాటలాడుచు నీచగానముల జేయుచుండును. కావున విలువగల దుస్తులు ధరింపరాదు.

*ప్రశ్న:మనస్సులో నొకప్పుడు శాంతి యుండును కాని యది చిరకాలమేందు కుండదు?

సమా: వెదురు కర్రనిప్పు మనమూది రగుల్కొల్పని యెడల త్వరగా నారిపోవును. ఆత్మజ్ఞానమనియెడి నగ్నిహోత్రము ఆరిపోకుండ నిత్యము వెలుగుచుండుటకై యెడతెగని భక్తియవసరము.

*తల్లియైన దేవినీ విధముగ వేడికొనుము. "ఓ తల్లీ! నిర్మలమైన భక్తిని వజ్రమువలె నిర్భేద్యమైన విశ్వాసమును నాకు నీవు ప్రసాదింపుము".

*విష సర్పములున్న యింట నివసించు మనుష్యులు మిక్కిలి జాగ్రత్తగా నుండి మెలగునట్లు ప్రపంచమున వసించు మనుష్యులు కామలోభములను నట్టి దుర్వ్యసనముల బడకుండమిక్కిలి జాగ్రత్తగా నుండవలయును.

*కుండకు సూది బెజ్జమంత చిల్లి యుండినను నీరంతయు దానిలో నుండి కారిపోవును. అలాగే ధర్మానుష్ఠానమందు బ్రవేశించు వానికి యందు స్వల్ప మోక్షమున్నను వానియనుష్ఠానమింతయు వ్యర్థమగును.

*ప్రశ్న: హిందువులలో అనేక మతములున్నవి! ఏ మతమవలంబింప వలయును?

సమా: ఒకనాడు పార్వతి మహాదేవునిటడిగెను. "ఓ దేవానిత్యమై నిరుపమానమై సర్వోత్కృష్టమైన యానందమునకు మూలమేమి?" ఆమెకు మహాదేవుడిట్లనియె. "విశ్వాసమే మూలము". మతముల యొక్కయు శాఖల యొక్కయు విశేషలక్షణములు ముఖ్యమైనవి కావు. ప్రతి మనుష్యుడు తన మతమునందు విధింప బడిన ధర్మములను భక్తి శ్రద్ధలతో జేసిన జాలును.

*యౌవనమురాని యాడు పిలలు మగపిలలు సంభోగ సౌఖ్యము యొక్క యానంద మెరుగనట్లే లౌకికుడు బ్రహ్మానంద పారవశ్యము యొక్క చలి నెరుగడు.

*ప్రశ్న:మనస్సులో నున్న పాపచింతను జయించుటెట్లు?

సమా: పువ్వులో నుండి పండు క్రమక్రమముగా నెదుగుచున్నప్పుడు పూరేకు లొక్కొక్కటిగా రాలి పోవుచుండును. కావున దైవత్వము మనలో నతిశయించిన కొలది దుష్ట స్వభావములు వాటంతటవి నశించును.

*ప్రశ్న: ఇహలోక సంబంధములైన యింద్రియ సుఖములమీది యాసక్తి యెప్పుడు నశించును.

సమా: పరిచ్ఛేద సహితుడగు భగవంతుని యందు సకల సుఖము యొక్కయు సకల సంతోషముల యొక్కయు సమీకరణమున్నది. అట్టి భగవంతుని యందు రమియించువారు పనికి మాలిన ప్రాపంచిక సౌఖ్యము నందు తమకము చూపరు.

*ప్రశ్న:ఏ స్థితిలో మనస్సున్నప్పుడు పరమేస్వర దర్శనమగును?

సమా : మనస్సు ప్రశాంతమై నిర్మలమైనపుడు భగవంతుడుగనబడును. మనస్సముద్రము వాంఛావాయువుల చేత సంక్షుభితమైనపుడు భగవంతుడు దానిలో ప్రతిఫలింప జాలడు. అట్టి దశలో భగవద్దర్శనమసాధ్యము.

*మనము దైవము నెటులు కనుగొనగలము?

సమా : పలెవారు పెద చేపను బటుకొనవలెనని కోరిగాలమున కెర గ్రుచ్చి చేప దానిని బట్టికొను వరకు నిశ్చబముగా నిరీక్షించుచుండును. భక్తుడు భక్తి సాధనములను జేయుచు నోపికతో గని పెట్టుకొని యున్న పక్షమున దైవము తప్పక కనపడును.

*జ్ఞాన మద్వైతమునకు దారితీయును. అజ్ఞానము భిన్నతకు దీసికొని పోవును.

*సత్పురుషుల సహవాసము బియ్యపుకడుగునీళ్ళ వంటిది. కడుగు నీళ్లు మత్తును బోగొట్టును. అటే సాధువులమైత్రి కోరికలని యెడి మద్యము దాగి మత్తిలియున్న మూఢ మానవుల మత్తు దూరముగా బోగొట్టును.

* బ్రహ్మజ్ఞానము మగవాని వంటిది. దైవభక్తి స్త్రీవంటిది. జ్ఞానము పరమేశ్వరుని వీధిగదులలోనికి మాత్రమే బోవగలదు. భక్తి ఆడది కనుక భగవంతుని అంతఃపురములోనికి ప్రవేశింప వచ్చును.

* భక్తియు జ్ఞానము చిట్టచివరకు ఒకటే. శుద్ధజ్ఞానమునకు శుద్ధ భక్తికి భేదములేదు.

## కార్తీకమాస పూజలు - మన సంస్కృతి

# కార్తీక మాహాత్మ్యము- వనసమారాధన

- శ్రీహరినాగేశ్వర శర్మ

*(గత సంచిక తరువాయి)*

సూర్యుడు తులారాశియందుండు కార్తీక మాసమున విష్ణువు ఎల్లప్పుడును ధాత్రిని ఆశ్రయించియు, కార్తీకశుద్ధ ద్వాదశి దినమున అనగా క్షీరాబ్ధి ద్వాదశియందు తులసినాశ్రయించియుండును.

శుభప్రదములగుచు, భారతీరూపములగు తులసీ, ధాత్రుల యారాధన గూడ భారతీయులమగు మనము జేయునదియే.

ఇట్టి తులసీ, ధాత్రీ వృక్షములతో గూడినది వనము. వనమనగా అడవియని సామాన్యముగ అందరికి తెలిసిన యర్థము. కాని 'వన'మనగా నీరు యనునర్థము కూడ యున్నది. ఇదిగాక వ్యుత్పత్త్యర్థ మునుగూడచూతము.

*వనతీతి - వనం (వన సంభక్తౌ)*

లెస్సగా కూడియుండునది - వనము

*వన్యతే సేవ్యత ఇతి - వనం*

జనులచేనాశ్రయింపబడునది - వనము. సకల దేవతల కాశ్రయ భూతములగు తులసీ, ధాత్రీ వృక్షములతో గూడిన వనమున జనులందరు గూడి భగవదారాధన చేయుట 'వన సమారాధన'.

*ఆరాధ్యతే ఇత్యారాధనా*
*సమం ఆరాధ్యతే ఇతి - సమారాధనా.*
*తత్రబృందావనే పూజాం యఃకుర్యాద్బుద్ధిమాన్నరః ।*
*ఆయురారోగ్యమైశ్వర్యం ప్రాప్నుయాన్నాత్ర సంశయః॥*

*నకు ర్వాద్యః పుమాన్ పూజాం తులసీ సహితం హరిం*
*పూర్వపుణ్యో మహీయేత రౌరవం నరకం వ్రజేత్ ॥*

బృందావనమున భగవదారాధన జేయువారు ఆయురారోగ్యైశ్వర్యముల నొందుదురనుటలో సందేహములేదు.

తులసీ సహితుడగు హరిని పూజించనివాని పూర్వపుణ్యము నశించి రౌరవాది నరకమున బడునని రెండవ శ్లోకభావము.

*సహనా వవతు సహనౌభునక్తు*
*సహవీర్యం కరవావహై*

*మావిద్విషావహై*
*ఓం శాంతిః శాంతిః శాంతిః ।*

అను నీమంత్రార్థముగూడ - అందరునొకచో గూడి, ఒకరినొకరు ద్వేషించుకొనక, దివ్యతేజస్సు కొ రకు భగవదారాధన చేయుదమనియే.

*ఉత్తిష్ఠత మాస్వప్త అగ్నిమిచ్ఛ ధ్వం భారతాః ।*

భారతీయులందరు నిద్రించక లేవండి. అగ్న్యారాధన జేయుడనిపై మంత్రార్థము.

ఇట్టి మాహాత్మ్యము, ప్రాధాన్యతగల కార్తీక మాసమునందు దీపారాధనను, తులసీ, ధాత్రీ సహిత లక్ష్మీనారాయణుని యారాధనను అందరిని యొకచోట గూర్చు వనప్రదేశమున నిత్యము జేసి భగవత్కృపకు పాత్రులగుదము.

*మంగళంకోసలేంద్రాయ*
*మహనీయగుణాత్మనే ।*
*చక్రవర్తి తనూజాయ*
*సార్వభౌమాయ మంగళమ్ ॥*

కనబడింది. తొందరపడి తూలనాడినవాళ్ళ నోళ్ళు మూతపడినవి.

# ఆనంద సంక్రాన్తి

రచన - హరినాగేశ్వరశర్మ

ప్రతిసంవత్సరము జనవరి 14న తేదీన సంక్రాన్తి. దీనికి ముందురోజు, తరువాత రోజు మొత్తం మూడు రోజులీ పండుగను చేసుకుంటారు.

ఈ సంక్రాన్తి పండుగ విశేషమును తెలుసుకునే ముందు సంస్కృత భాషలోని కాంతిః, క్రాన్తిః, సంక్రాన్తిః అను నీమూడు శబ్దముల యర్థముల జూతము.

కాంతిః అను శబ్దమునకు సౌందర్యము, కాంతి, ఇచ్ఛయనునవి అర్థములు.

క్రాన్తిః అను శబ్దమునకు పోవుట, ముందుకు సాగుట, అడుగు, అతిక్రమణము యనునర్థములున్నవి.

సంక్రాన్తి శబ్దమునకు సూర్యుడొకరాశినుండి వేరొక రాశిలోనికి పోవుట యనునది అర్థము.

సంక్రమము, సంక్రమణము అను యీ శబ్దములు రెండును సంక్రాన్తి శబ్దమునకు పర్యాయములు.

కామ్యత ఇతి కాంతిః - వశము చేసుకొనునది లేక కోరబడునది, యనునవి కాంతి శబ్దమునకు వ్యుత్పత్త్యర్థములు.

శోభాకాంతిర్ద్యుతిశ్ఛవిః (అమరకోశము)అని చెప్పుటచే కాంతి శబ్దమునకు 'ఛవిః' అనునది పర్యాయపదము.

ఛవిః - ఛ్యతి నాశయత్యధకారమితి
ఛ్యతి నాశయత్యశోభామితి

ఛవిః అనగా అంధకారమును, అశోభను నశింపజేయుటయని పై వ్యుత్పత్తుల ద్వారా తెలియుచున్నది.

లోకమున యీఅంధకారమును, అశోభను నశింపచేసి మనము కోరు కాంతినిచ్చువాడు సూర్యుడు. ఆ సూర్యుని నిత్యము ఆరాధించువారు సకల భద్రముల బడయునని.

"ఉద్యన్త మస్తం యన్తమాదిత్యమభిధ్యాయన్కుర్వ
న్బ్రాహ్మణో విద్వాన్సకలం భద్రమశ్నుతే"
అను నీమంత్రార్థము చెప్పుచున్నది.

ఇట్లు సకల భద్రముల నొసగుచు, కర్మసాక్షి, జగచ్చక్షువునగు సూర్యుడు సమస్తప్రాణికోటికి ప్రత్యక్షదేవత, అన్నదాత కూడ. అట్టి యీ సూర్యుడు క్రమము తప్పక ప్రతిదినము సప్తాశ్వరథారూఢుడై సంచరించుచు మనము కోరుకాంతిని, మనకు ప్రాణాధారములగు పంటలు పండుటకు తగిన వర్షమును ఇచ్చుచున్నాడు.

ఒక సంవత్సరములో యీ సూర్యుని సంచారము దక్షిణ దిశగను సాగుచుండును. ఉత్తరదిశగా సాగు గమనమును ఉత్తరాయణమని, దక్షిణదిశగా సాగుగమనమును దక్షిణాయనమని అంటారు.

జ్యోతిశ్శాస్త్రానుసారము మేషాదిరాశులు పన్నెండున్నవని తెలియుచున్నది. ఒక సంవత్సరములో సూర్యుడొక్కొక్క మాసమొకరాశిలో యుంటూ గమనము సాగిస్తూ యుంటాడు. ఒకరాశి నుండి మరియొకరాశిలోనికి సూర్యుడు ప్రవేశించుటకు సంక్రాన్తియనిపేరు. ఉదాహరణకుసూర్యుడు మేషరాశిలోనికి ప్రవేశించు రోజును మేషసంక్రాన్తియని,...........తులారాశిలో ప్రవేశించు రోజును తులాసంక్రమణమని,............... మకరరాశిలో ప్రవేశించుట మకరసంక్రమణమని యంటారు. దీనిని బట్టి సంవత్సరములోని ప్రతిమాసమందును సంక్రాన్తి యుండునని తెలియుచున్నది. ఈ విధముగ పన్నెండు మాసములందును పన్నెండు సంక్రాన్తు లుండును.

తత్రమేషాదిషు ద్వాదశరాశిషు క్రమేణ
సంచరతః సూర్యస్యపూర్వస్మాద్రాశేః
ఉత్తరరాశౌ సంక్రమణ ప్రవేశః సంక్రాన్తిః.

ఇట్టి యీ పన్నెండు సంక్రాన్తులలో కెల్ల సూర్యుడు ధనుస్సు నుండి మకరరాశిలో ప్రవేశించు సంక్రాన్తికి చాల ప్రాముఖ్యమున్నది. దీనిని మకర

సంక్రాన్తియని, మకరరాశి ప్రవేశకాలమును ఉత్తరాయణ పుణ్యకాలమని యందురు.

ఇప్పటి వరకు దక్షిణ దిశగా సంచరించు సూర్యుడు ఈరోజునుండి ఉత్తరదిశగా పయనము నారంభిస్తాడు

ఉత్తరాయణ పుణ్యకాలమునందు బ్రాహ్మణులకు కూశ్మండదానము, తిలదానము, వస్త్రదానము మొదలగునవి చేసి ఉత్తమపుణ్యములబడయుదురని ధర్మసింధువులో ఈవిధముగ చెప్పబడినది.

విషువేచాయుతం ప్రోక్తం కోటి దం దక్షిణాయనే।
శతకోటిగుణం పుణ్యం జాయతే తూత్తరాయణే॥

ఇంతటి యుత్తమ పుణ్యములనిచ్చునది గనుకనే మహాభారతయుద్ధమున పదవ రోజున నేల కొరిగిన భీష్ముడు తన తండ్రి వలన స్వచ్ఛందమరణమును వరముగా పొందినందువల్ల, నేల కొరిగిన సమయము దక్షిణాయమమైనందున, ఉత్తరాయణమందు మరణించినవారు స్వర్గమునకు బోవుదురని చెప్పబడినందున, తన మరణమునుత్తరాయణము వరకు ఆపుకొందునని చెప్పినట్లీ మహాభారత శ్లోకములవలన తెలియుచున్నది.

ధారయామాసచప్రాణాన్పతితో౽పిహిభూతలే।
ఉత్తరాయణమన్విచ్ఛన్భీష్మః కురుపితామహః॥
ధారయిష్యామ్యహం ప్రాణానుత్తరాయణ కాంక్షయా।
ఐశ్వర్యభూతః ప్రాణానాముత్సర్గేనియతోహ్యాహమ్॥
తస్మాన్ప్రాణాన్ధారయిష్యేముమూర్షురుదగాయనే।
యశ్చదత్తోవరోమహ్యం పిత్రాతేన మహాత్మనా॥
ఛన్దతోమృత్యురిత్యేవం తస్యచాస్తువరస్తథా॥

ఉత్తరాయణ మందలి విశేష శక్తిదీని ద్వారా మన కవగతమగుచున్నది గద.

సూర్యుడు మకరరాశి ప్రవేశమునకు ముందు ధనుస్సులో ఒక మాసముండుట వలన దీనికి ధనుర్మాసమని పేరు కలిగినది. ఈ ధనుర్మాసములో పూర్ణిమముందు వచ్చు ఏకాదశిని వైకుంఠ ఏకాదశియని ముక్కోటియని యందురు.

ఈ ముక్కోటి విశేషమునిపుడు చూతము.

ఇప్పటి వరకు మూసియున్న స్వర్గద్వారములు ఈరోజునుండి తెరువబడుతాయని పురాణముల ద్వారా తెలియుచున్నది. విష్ణుమూర్తి గరుడారూఢుడై యీ ఏకాదశి రోజున ఉత్తర ద్వారమందు దర్శనమిస్తాడట. అందువలన యీరోజున దేవాలయములలో గరుడాడూఢుడైన స్వామిని ఉత్తర ద్వారమున ఉషఃకాలమున వేంచేయింప చేస్తారు. దీనిని ఉత్తరద్వార దర్శన మంటారు. ఉత్తరద్వారమున దర్శనమే ఉత్తరాయణ ప్రారంభ సూచియంటారు.

విశ్వం వేవేష్టి వ్యాప్నోతీతి - విష్ణుః

విశ్వమంతటను వ్యాపించు కాంతినే విష్ణువు అందురు. ఈ కాంతి దివారాత్రములనే రెక్కలు గల గరుడుని అధిరోహించి యుండుటయే విష్ణువు గరుడ వాహనారూఢుడగుట. ఈ కాంతి ప్రథమతః ఉత్తర ద్వారమునుండి ప్రవేశించుటయే ఉత్తర ద్వారదర్శన రహస్యం.

విష్ణువు యనబడే ఈవెలుగును సూర్యుడు సర్వత్ర వ్యాపింపజేసి సమస్తజనులను నిద్రావస్థనుండి మేల్కొలిపి వారివారి కార్యకలాపములందు ప్రేరేపింపజేస్తాడుగనుకనే సూర్యునకు 'సవితా' (సువతి ప్రేరయతి వ్యాపారేష్వితి).

(సువతి సుప్తం ప్రేరయతీతి)యను నామాంతరము కలిగినది. అట్టి సూర్యుని నిత్యమారాధించవలెను.

అందువలననే 'ధ్యేయః సదా సవితృమండలమధ్యవర్తీ' యని ఆదిత్యహృదయప్రారంభశ్లోకము.

ఇంతియేగాక ఈ ధనుర్మాసవిశేషమింకొకటియున్నది.

భారతీయులకు గోవు పవిత్రమైన, పూజింపతగిన జంతువు. కామధేనువు తనను పూజించువారి కోర్కెలన్నిటినీ దీర్చును. ఈ కామధేనువు పుత్రికయగు నందినిని సేవించి దిలీపమహారాజు సత్పుత్రుని బడసెను.

ధనుర్మాసమున వచ్చు ఈముక్కోటి రోజున ఉత్తర ద్వార దర్శనానంతరము గోపూజచేస్తారు. గోవుద్వారా మనకు లభించే పాలు, పెరుగు, నేయి, గోమయం, గోమూత్రం వీటిని పంచగవ్యాలంటారు. ధనుర్మాస ప్రారంభమునుండి ఈ పంచాగవ్యములలో నొకటియగు గోమయముతో స్త్రీలు ఇళ్ళముంగిళ్ళలో కళ్ళాపిజల్లిచిత్రములగు అందమైన ముగ్గులను తీర్చిదిద్దుతారు. గోమయముతో గొబ్బిళ్ళు చేసి ఈ ముగ్గుల మధ్యనుంచి ఆడపిల్లలు గొబ్బియల్లో, గొబ్బియల్లోయని పాడుకుంటారు. తగిన భర్త లభించునని దేవతగ యారాధిసా్తరు.

వెంకటేశ్వరస్వామి భక్తుడగు అన్నమాచార్యులు తన కీర్తనలలో-
'కొలని దేవరికి గొబ్బిళ్లో, యదుకుల స్వామికి గొబ్బిళ్ళో'
యని మధురంగా పాడుకున్నాడు.

ఈవిధంగా ధనుర్మాసమంతయు, సంక్రాన్తి రోజువరకు ముగ్గులు వేసి గొబ్బెళ్ళు పెడ్తారు.

వర్షాకాలమున వర్షముతోను, తరువాత మంచుతోను తడిసినందువల్ల తడి ఎక్కువగా యుండి దక్షిణాయనమున జనులు అనేక రోగముల చేతను, ఈతిబాధలచేతను ఇక్కట్లకు గురియగు చుందురు. ఈ పండుగదినమునుండి జగమంతట ప్రసరించు కాంతి వల్ల ఇట్టి బాధలన్నీయు తొలగి పోవు చుండును.

వర్షములో తడుస్తూ, చలిలోను, మంచులోను వణకుచు కష్టపడి పండించిన పంటను రైతులు ఇంటికి తెచ్చుకొను యానందములో కూడ ఈ పండుగను జరుపుకుంటారు.

పల్లెలలో ఈపండుగ రోజులలో కోడి పందాలతో యానందిస్తూ యుంటారు.

గంగిరెద్దుల నందముగా అలంకరించి యాడించుచు యొకప్రక్క, హరిదాసుల పాటలతో యొక ప్రక్క, ఆడపిల్లల గొబ్బిపాటలతో యొక ప్రక్క, ఇళ్ళలో బంధుమిత్రాదుల గూడి చేసుకునే పండుగ సందడి యొకప్రక్క, ఇవిగాక బొమ్మలకొలువులు దీర్చి చిన్నపిల్లలకు భోగిపండ్లు పోయుచు యొక ప్రక్క ఈవిధముగ అంతులేని యానందముతో యీమూడుదినములు

గడుస్తాయి.

ఈవిధముగ సకల జనానందకరమైనదీ సంక్రాన్తి పండుగ. కనుకనే ఇది సంబరాల సంక్రాంతి.

ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ । ఆనందాద్దేవఖల్విమాని భూతాని జాయన్తే। ఆనందేన జాతాని జీవన్తి।

అన్నవేదోక్తికి సంక్రాన్తి పండుగ నిదర్శనము.

సర్వేజనాస్సుఖినోభవంతు.

---

# సంతాప తీర్మానము

సర్వార్థ సంక్షేమ సమితి ట్రస్టుబోర్డు ఈరోజు 20-1-96న శ్రీ పి.వి.మనోహరరావు, చైర్మన్‌గారి అధ్యక్షతన అత్యవసర సమావేశము జరిపి, ఈ దిగువ సంతాపము ఏకగ్రీవంగా తీర్మానించినది.

"విశ్వవిఖ్యాత, చలనచిత్రనటనాగ్రేసరుడు, ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి నందమూరి తారక రామారావుగారి అకాల మరణమునకు, రెండు నిమిషాల మౌనము పాటించి, వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థించి, వారి కుటుంబ సభ్యులకు, ప్రగాఢ సంతాపము వ్యక్త పరచి, తీర్మానించడమైనది."

అదేవిధముగా ఈరోజు 21-1-96న "విశ్వప్రకాశం"మాసపత్రిక సంపాదకమండలి ముఖ్యసంపాదకులు పి.వి. మనోహర రావు అధ్యక్షతన సమావేశమై ఈ క్రింది సంతాపతీర్మానము చేపట్టినది. శ్రీవిశ్వవిఖ్యాత నటనాగ్రేసరుడు, అసదృశపౌరాణీక, రామ, కృష్ణ ఇత్యాది పాత్రధారి, రాజకీయదురంధరుడు, ఆంధ్ర రాష్ట్ర మాజీముఖ్యమంత్రి శ్రీనందమూరి తారక రామారావు హఠాన్మరణానికి సంపాదకమండలి తమ ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తపరుస్తూ ఒకనిమిషం మౌనం పాటించి, వారి కుటుంబసభ్యులకు తమ సానుభూతిని తెలియపర్చుచు తీర్మానించినది. సంపాదకమండలి సభ్యులందరూ హాజరు అయినారు. పివి. మనోహరరావు, ముఖ్యసంపాదకులు, డా. బి. రామరాజు, డా. పోతుకూచి సాంబశివరావు, కె. వెంకటశివయ్య,IAS, డా. డి. శ్యామలాదేవి, ఎం. ఎల్. నరసింహారావు, డా. రమాపతిరావు కూడా హాజరయినారు.

# అయ్యప్పస్వామి-వైదిక స్వరూపము

- శ్రీ హరి శ్రీరామమూర్తి

మనది కర్మభూమి. వైదిక భూమి. ఇచటి ప్రజలంతా నిత్యము వేదారాధన తత్పరులు. వేదమునకు 'భారతీ' అని పేరు. అంటే సరస్వతి. "బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాక్వాణీ సరస్వతీ" అని అమరకోశము. భారతిని అనగా వేదమాతను సరస్వతిని ఆరాధించుటచే ప్రజలందరు భారతీయులు. ఈ లోకమే భారతము. "లోకఽయం భారతం వర్షమ్" అని కోశము. "భాయాం రతాః భారతాః" అని వ్యుత్పత్తి. 'భా' అంటే సూర్యకిరణం, కాంతి, తేజస్సు జ్యోతిస్సు, ప్రభ. "స్యుః ప్రభా ఋక్ ఋచిః త్విట్ భా భాశ్చ విద్యుతి దీప్తయః" అని కోశము. ఈ 'భా'ను-తేజస్సును. ఆరాధించుటచే ప్రజలు భారతీయులు. ఋగ్యజుస్సామాది వేదములు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులున్నూ తేజస్సు లేనని వేదములు తెల్పుచున్నవి.

"నారాయణః పరోజ్యోతిః" అని మంత్రపుష్పము. "విహాయస గతిః జ్యోతిః" అని విష్ణు సహస్రనామాలు. "ఉగ్రతేజా మహాతేజా" అని శివ సహస్రనామాలు. ఇట్లు హరి హరులిద్దరూ తేజస్సులే. ఈ హరి హరుల పుత్రుడు అయ్యప్ప అని చెప్పబడుచున్నాడు. హరి హరులకు పుత్రుడెట్లుగల్గునను సందేహనివారణకు వేదమే శరణ్యము.

అయ్యప్ప సహస్రనామాల్లో "భానుమాన్ భాను తేజసః" "దేవసేనాధి పస్తేజాః తేజోరాశిః దశాననః" -"మంత్రనిధిః మంత్రదేవోమంత్రరాశిః మహాధృఢః "-"ఋగ్వేదరూపః" "సామవేద పరాయణః" అని నామముల ద్వారా అయ్యప్పస్వామి తేజోరాశి అని, మంత్రస్వరూపుడని, వేదపురుషుడని తెలియును అట్లే శరణుఘోషలో "జ్యోతి స్వరూపనే శరణమయ్యప్ప" అయ్యప్పను జ్యోతిస్సుగా ఆరాధిస్తున్నాము. ముందు, ప్రార్ధనలో గూడ "తేజోమండల మధ్యగం త్రినయనం దివ్యాంబరాలంకృతం" అని ఉన్నది. అంటే అయ్యప్పస్వామి రెండు తేజోమండలముల మధ్య నుండువాడని తెలుస్తున్నది. ఈ రెండు తేజోమండలముల నుండు మరియొక తేజోరాశి ఏది? ఈసంగతి విచారింతము. ఎట్టి సందేహమునైనను వేదము తప్ప తీర్చు వారు ఎవరూలేరు.

వేదము మనకు అయిదు సంధులను ప్రసాదించినది. "అధిలోకం, అధిజ్యౌతిషం, అధివిద్యం, అధిప్రజం, అధ్యాత్మ" అని తైత్తిరీయోపనిషత్తు.

ఉదాహరణకు కొన్ని చూద్దాము.

1. అధివిద్యం-ఆచార్యః పూర్వరూపం, అంతేవాస్యుత్తర రూపం, విద్యాసంధిః, ప్రవచనగ్ం సంధానమ్-సంధి అంటే రెండు వస్తువులను కలుపునది. విద్య అనేది ఒకసంధి. ఈసంధి గురుశిష్యుల నిద్దరిని కలుపుచున్నది. ప్రవచనమే వారి సంధాన కర్త-గురు, శిష్యుల మధ్య సంధి విద్య యని యర్థము.

2. అధి ప్రజం-మాతా పూర్వ రూపం-పితోత్తర రూపం-ప్రజాసంధిః -ప్రజననగ్ం సంధానమ్-తల్లి పూర్వరూపము-తండ్రి ఉత్తరరూపము-వీరిరువురి మధ్య సంధి సంతానము-సంధానము ప్రజననము. తల్లి దండ్రులిద్దరి మధ్య సంధాన కర్త, సంధి-సంతానమట.

3. అధ్యాత్మం - అధరాహనుః పూర్వరూపం-ఉత్తరాహను రుత్తరరూపం-వాక్సంధిః-జిహ్వాసంధానమ్. హనువులంటే దౌడలు. రెండుదౌడలు కలిస్తేనే గదా! నోటి నుండి వాక్కు పుట్టేది. రెండు దౌడలసంధి వాక్కు. నాలుక సంధానమట. వాక్కు అంటే వేదవాక్కు. అంటే వేదమంత్రములు. రెండు హనువులు కలిస్తే "హనూమాన్" అగును. అంటే హనుమంతుడు సంధి స్వరూపుడే-వేద స్వరూపుడే-సంధి యందు ఉండువాడు 'సంధ్య' యగును. (సంధౌభవా సంధ్యా).

పై విధముగ హరిహరుల నిద్దరిని కల్పుచున్నట్టి "అయ్యప్పస్వామి" గూడ సంధ్యా స్వరూపుడేయగును.

హరికి కృష్ణవర్ణము (నలుపు) హరునికి శ్వేత వర్ణము (తెలుపు) ప్రసిద్ధము. వర్ణమనగా రంగు-తేజస్సు-జ్యోతిస్సు. ఈనలుపు, తెలుపు వర్ణములను-కాంతులను-కల్పుచున్నట్టి లేక ఆకాంతుల మధ్య సంధి రూపంలోనున్న మరియొక కాంతి మరి యొకటి గలదట. ఆవర్ణము లేక కాంతి అరుణ వర్ణము లేక అరుణకాంతి యని వేదములు, కావ్య, నాటకాదులలో చెప్పబడినది.

కాళిదాసు మహాకవి రచితమై అభిజ్ఞాన శాకుంతల మనెడి నాటకమందీ విషయమిట్లు వర్ణింపబడినది.

యాత్యేకతో౽స్త శిఖరం పతిరౌషధీనాం
ఆవిష్కృతో౽రుణ పురస్సర ఏకతో౽ర్కః
తేజోద్వయస్య యుగపత్ వ్యసనోదయాభ్యాం
లోకోనియమ్యత ఇవాత్మ దశాంతరేషు.

ఒకవైపు చంద్రుడస్తమించుచున్నాడు. అరుణునితోగూడి లేక అరుణకాంతిని ముందుపెట్టుకొని సూర్యుడుదయించు చున్నాడు. ఈ ప్రపంచమంతా ఈరెండు తేజస్సుల చేత పాలింపబడుచున్నది నియమించబడుచున్నదని-ఒక ఋషి ఆశ్రమములో నిద్రలేచిన శిష్యుడుప్రభాత సంధ్యను గూర్చి వర్ణిస్తున్నాడు. ఆరెండు తేజస్సులు-నలుపు, తెలుపు-ఆరెంటి మధ్యన అరుణ తేజస్సు. ఒకటి హరితత్త్వము రెండవది (శివ) హరతత్త్వము. ఈ రెంటి నడుమ-సంధి-అరుణవర్ణము-బ్రహ్మతత్త్వము. బ్రహ్మ విష్ణువు నాభినుండి పుట్టునట్లు చెప్పబడుచున్నది. ఆ అరుణ తత్త్వమే సంధ్యరాగము. అదే కాషాయరంగు. అందుకే యతీశ్వరులు, స్వాములు కాషాయరంగు బట్టలు ధరించే సాంప్రదాయం వచ్చింది. అరుణ తేజస్సునే సంధ్య యని, గాయత్రియని, హనుమంతుడని, లలితయని, చెప్పబడుచున్నారు.

"సంధ్యారుణానవద్యాంగి"-"గాయత్రీవ్యాహృతిస్సంధ్యా"-'అరుణాం కరుణా తరంగితాక్షీం' అని లలితాసహస్రనామాలు. కావున చంద్రుడస్త మించటం అంటే చీకటి అంటే నలుపు రంగు పోతోంది. సూర్యుడు దయిస్తున్నాడంటే ముందు అరుణకాంతి ఆ తరువాత తెలుపు రంగు కాంతి వస్తున్నది. ఇట్లు ఈ రాత్రింబవళ్లే నలుపు తెలుపుకాంతులే హరి హరస్వరూపములనీ, ఆరాత్రింబవళ్ళ మధ్య నుంటూ వానిని కలుపుచున్న అరుణ కాంతియే సంధి-సంధ్య యని ఆ సంధ్యావందనం సదా ఆచరించ వలెననీ కాళీదాస మహాకవి అభిప్రాయం.

ఇట్టి హరి (నలుపు-కాంతి) హర (తెలుపు కాంతి)-వీరి పుత్రుడు హరిహర పుత్రుడుగదా! వారి పుత్రుడు వారికి సంధి స్వరూపుడేగదా! కాన యీ హరిహరపుత్రుడు సంధ్యా స్వరూపుడే. కాన అయ్యప్పస్వామి సంధ్యా-గాయత్రీ-లలితా, బ్రహ్మ అగును. కావుననే "తేజోమండలమధ్యగం" అను అయ్యప్ప స్వామి ప్రార్థనలోని అంతర్యము ఇదియే. కృష్ణ, శ్వేత తేజస్సుల మధ్య నున్న అరుణ తేజస్సే-అయ్యప్ప రాత్రింబవళ్ల మధ్య నున్న అరుణ తేజస్సే-సంధ్యయే-అయ్యప్ప. హైదరాబాద్‌లో నొక దేవాలయమున నిట్లే

గలదు. హరి హరుల విగ్రహములు నలుపు-తెలుపు రంగులలోను, వాని మధ్య అయ్యప్పస్వామి విగ్రహము అరుణ వర్ణముతో నలరారుచున్నది. అందుకే స్వామిని "అరుణోదయసంకాశం నీలకుండల ధారిణం" అని స్తోత్రము చేస్తున్నారు. ఇట్టి అయ్యప్పస్వామి-వేదనిధి, ఋగ్వేదరూపుడు, మంత్రదేవుడు, మంత్రరాశియని సహస్రనామాల్లో కీర్తింపబడుచున్నాడు. కావున అయ్యప్పస్వామి ఆరాధన అంటే వేదమాతసేవయే. వేదమాతృసేవయే అయ్యప్పస్వామి ఆరాధన. ఇందు ఎట్టి సందేహము లేదు.

ఈ పై మూడు తేజస్సుల గూర్చి చాల చోట్ల కనపడును. కాళిదాస మహాకవి రచలలో ఎక్కువగాను, వాల్మీకి రామాయణంలో హనుమంతుని వర్ణనలోను కన్పడును.

రఘువంశంలో గోవు సంధ్యా స్వరూపమనీ, దాని శరీరమంతా నలుపు, పైన తెల్లని రోమములు, ముఖము మీద చంద్రవంకవలె అరుణ రాగం గలదనీ అట్టి ఆవుని సేవించిన పుత్ర సంతానము గల్గుననీ కాళిదాసు చెప్పినాడు.

ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్ర మాబభౌ
సంధ్యయా సమభిస్పృష్టం యథైతత్ సూర్యమండలమ్.

రామాయణం-సుందరకాండ.

హనుమంతుని ముఖము తామ్రవర్ణము. రాగిరంగు అంటే అరుణ వర్ణము. ముక్కుగూడ తామ్రవర్ణము సంధ్యతో తాకబడుచున్న సూర్యమండలం మాదిరిగ నున్నదట. కాన హనుమంతుడు అరుణ పురస్సరముగానున్న సూర్యభగవానుడేనని కాళిదాసు వాక్యమునకు సరిపోవుచున్నది. ఇంకా అడుగడుగునా రామాయణంలో ఈ యరుణకాంతి గూర్చి సంధ్య గూర్చి చెప్పబడినది. కావున ప్రతివారు నిత్యము సంధ్యావందనము చేసి తీరవలసిందిగా మన పూర్వులు చెప్పియున్నారు . రామపూర్వతాపనీయోపనిషత్తులో సీతాదేవిని సంధ్యా స్వరూపంగా రాముడు కొల్చినట్లు చెప్పబడుచున్నది. రామ, లక్ష్మణుల మధ్య నున్న సీత-సంధి-సంధ్యయేగదా! రామలక్ష్మణులిర్వురు పరమాత్మ జీవాత్మలు-వారి నడుమ సీతాదేవి-సంధ్య-ఆమెయే వేదమాత. దీనియర్థము ఏజీవియైనా పరమాత్మను తెలిసి కోవలెనన్న వేదము ద్వారానే తెలియనగునని తాత్పర్యము. ఆ వేదమాతయే-సీతయే-గాయత్రియే-సంధ్యయే-అయ్యప్పస్వామి

స్వరూపము-ఇంకాసీతాదేవియే రామునికోసం సంధ్యావందన మాచరించు చుండునని చెప్పబడినది. ఇంకా పైమూడు తేజస్సులగూర్చి మామూలుగ మన వివాహాది శుభకార్యక్రమములలో ఆహ్వానపత్రికలలోని ముందు వ్రాసెడి ప్రార్థనా శ్లోకములో తెల్పబడుచున్నది.

జానక్యాః కమలామలాంజలి పుటే యాః పద్మరాగాయితాః
న్యస్తా రాఘవ మస్తకేచ విలసత్కుంద ప్రసూనాయితాః।
స్రస్తాః శ్యామల కాయ కాంతి కలితా యా ఇంద్రనీలాయితాః
ముక్తాస్తాశ్శుభదాభవంతు భవతాం శ్రీరామ వైవాహికాః. ॥

శ్రీసీతారాముల కల్యాణ సమయంలో సీతాదేవి శ్రీరాముని శిరస్సుమీద తలంబ్రాలు పోస్తుంది, అవి కొత్త దంపతులకు శుభమునిచ్చుగాక! ఎట్టి తలంబ్రాలు-అవి తలంబ్రాలు గాదు శుభ్రములైన, నిర్మలములైన, మలినములేని, రంగులేని ముత్యాలు.

ముందు ముత్యాలు సీతాదేవి చేతులలో నుంచబడినవి. ఆ దేవి చేతులు పద్మరాగంతో మెరిసిపోవుచున్నవి. అదే అరుణరాగం. ఆ ముత్యాలు గూడ అరుణకాంతిని పొందినవి. ఆపై నాముత్యాలను శ్రీరాముని శిరస్సుమీద పోయ బడగానవి మల్లెమొగ్గల రంగును అనగా తెల్లకాంతిని బొందినవట. ఆతరువాత శ్రీరాముని శిరస్సునుండి ఆతని నల్లని శరీరముపైనుండి జారుటచో ముత్యాలు గూడ నల్లకాంతిని బొందినవి. ఇట్లు ముందుగా అరుణ వర్ణము, తరువాత తెలుపు వర్ణము, తరువాత నలుపు వర్ణములకాంతితో కూడిన ముత్యాలు కొత్తదంపతులకు శుభముల నిస్తాయని శ్లోక తాత్వర్యము. ఈ శ్లోకము ముందు చెప్పబడ్డిన అభిజ్ఞాన శాకుంతల శ్లోకానికి రామాయణ శ్లోకానికి తాత్పర్య భూతము.

కావున ఈశ్లోకాన్ని పాలించెడివి మూడు తేజస్సులు, అవి కృష్ణ, అర్జున (తెల్పు), అరుణములే, అవేహరి, హర, అయ్యప్పలు అని స్పష్టము. ఇట్టి హరిహర పుత్రుడు తేజోమండలము మధ్యనున్నవాడు, అయిన అయ్యప్ప కృష్ణ, శ్వేత కాంతుల మధ్యనున్నసంధ్యా స్వరూపుడు. అరుణకాంతి మయుడు. వేద స్వరూపుడు. మంత్రదేవుడు. ఇట్టి అయ్యప్ప సేవయే సంధ్యావందనము. ప్రతివారీ సంధ్యావందనము చేసి తరింతురుగాక.

# ఎడద మాత్రము నీదు పాదాల నిలిచేను

*డా॥ జంధ్యాల జయకృష్ణ బాపూజీ*

విశ్వయోగిగ వేల వినుతు లందిన స్వామి
కరుణించి నన్నింక కాపాడ విది యేమి ॥ విశ్వ॥
దేదీప్యమానమౌ దివ్యజ్యోతివి నీవు
వడివడిగ పారేటి గోదావరివి నీవు
సమదర్శనుండైన సత్యయోగివి నీవు
వింత బంధాలున్న వీతరాగివి నీవు ॥ విశ్వ॥
వంకరలు టింకరలు ఓర్పుతో సవరించి
అటు తట్టి ఇటుతట్టి అందమ్ము చేకూర్చి
మట్టికుండల మంచిమనుషులుగ మార్చేటి
మహిమాన్వితుండైన మహితాత్ముడవు నీవు ॥ విశ్వ॥
చెయి నిమురుతుంటేను మెయి పులకరించేను
తీయతీయగ పలుక తేనెలే పొంగేను
ఇన్నాళ్ల సొదలన్ని ఎటకెటకొ పోయేను
ఎడద మాత్రము నీదు పాదాల నిలిచేను ॥ విశ్వ॥

# అనుభవతరంగిణి

శ్రీ జి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ

గాణాగాపురంలో సావిత్రమ్మగారు మాస్టరుగారు ఎటుపోతే అటునీడవలె అనుసరించేది -మాస్టరు గారున్నచోట ఏదో విశేషం ఉంటుందని, మాస్టరుగారు "సంగం" లో స్నానం చేస్తుంటే తాను అక్కడే స్నానం చేసేది. ఆయన వడ్డుకు వస్తే తానూ వడ్డుకు వచ్చేది. ఔదుంబర వృక్షానికి ఆయన ప్రదక్షిణలు చేస్తుంటే తానూ ప్రదక్షిణలు చేసేది. ఆ తర్వాత గాణగాపూర్ గుళ్ళో పూజకు అందరితోబాటు తానూ చీటీతెచ్చుకొని,కొబ్బరి కాయ స్వామివారినిర్గుణపాదుకలకు తాకించి ప్రసాదంగా తెచ్చుకొంది. గాణగాపూర్‌లో ఆమె ఉన్నంతకాలం హైదరాబాదులో ఉన్న తనపిల్లలసంగతిగాని, వాళ్ళుపడుతున్న బాధలుగాని ఏవీ ఆమెకు జ్ఞాపకం రాలేదు. మనస్సు పరమప్రశాంతమైంది.

షిర్డీవెళ్ళిన తర్వాత అక్కడ ఉన్న విశేషాలు చూస్తూ 'గురుస్థాన్' కు వచ్చి అక్కడున్నవేపచెట్టుదగ్గరకూచుంది. లేద్దామంటే లేవబుద్ధికాలేదు. ఇంతలో మాణిక్యమ్మగారు ఆమెను వెదుక్కుంటూవచ్చి "ఏవండో! ఇక్కడేలీనమై పోతారా యేమిటి! లేవండి ! అంటూ ఆమె కూడా సావిత్రమ్మగారి ప్రక్కనే చతికిలబడింది. ఆమెకూడ లేవలేక పోయింది. అప్పుడామెకు సావిత్రమ్మగారు అక్కడినుంచి ఎందుకు లేవలేక పోయిందో బాగా అర్థమైంది. తాను కూచున్నచోట ఒకకొబ్బరికాయ తాకించి, దాన్ని తీసుకపోయి హైదరాబాదులోని తన పిల్లలకిస్తే బావుండుననే అభిప్రాయం సావిత్రమ్మగారికి కలిగింది. ఆ విధంగా చేసి, తన సంచిలో గాణగాపురం నుంచి తెచ్చిన కొబ్బరికాయ మీద ఈకొబ్బరికాయ గుర్తుగా పెట్టింది. మాస్టరుగారు సమాధి మందిరం నుంచి ద్వారకామాయికి పోతుంటే తానుగూడా మాస్టరుగారి వెంటవెళ్ళింది.

మాస్టరుగారు ధుని దగ్గరనుంచోని, షిర్డీలో చేయించిన పొంగలి ఒక్కొక్క ముద్ద ధునిలో వేస్తుంటే కళ్ళప్పగించి, అదృశ్యంచూస్తూనిలబడింది. ఆసమయంలో మాస్టరు గారి ముఖం నుంచి ప్రసరిస్తున్న దివ్యతేజస్సు ఆమె కళ్ళను జిగేల్మనిపించింది. దగ్గరకు పోయి చేయి జాపితే మాస్టరుగారు పొంగలి ఆమె చేతిలో వేశారు. ఆమె కూడా పొంగలి ధునిలో వేసి "ధన్యోస్మి" అనుకొంది.

షిర్డీ నుంచి హైదరాబాదు బయలు దేరారు. మరునాడు హైదరాబాదు చేరుదామనగా బస్సు ఒకచోట ఆగింది. అంతా కిందకు దిగారు. బస్సులో సావిత్రమ్మగారు, వల్లూరు నుంచి వచ్చిన ఎర్ర మ్మగారు ఇద్దరు మాత్రమే మిగిలారు. వెనక సీటులో మాస్టరుగారున్నారు. మాస్టరుగారు" మామ్మగారూ! " అని పిలిచారు. ఆపిలుపు సావిత్రమ్మగారికి అలవాటు లేకపోవడం వల్ల "ఎవరిని పిలుస్తున్నారోని" అనుకొంది. జవాబు ఇవ్వలేదు. ఎర్ర మ్మమాస్టరుగా దగ్గరకు పోయింది. ఆమె గర్భవతిగా ఉన్నప్పుడు -ఆ ఇరువై యేళ్ళవయస్సులోనే - ఆమె భర్త సన్యాసుల్లో కలిశాడు. ఆయన ఎక్కడున్నాడో? ఇంతవరకు అతీగతీలేదు. మాస్టరు గారు ఆమెను చూచి "మీ ఆయన ఋషీకేశ్‌లో హాయిగా ఉన్నాడు అన్నారు. ఆమెకప్పుడు అరవైయేళ్ళు. మాస్టరుగారు తన భర్తపేరు ఎత్తగానే ఆమెసిగ్గుతో మెలికలు తిరిగిపోయింది. మళ్ళీ"మామ్మగారూ!" అని పిలిచారు మాస్టరుగారు. అప్పుడే బస్సులోకి ఎక్కుతున్న అడ్వకేటు కృష్ణమూర్తిగారు ఆమాటవిని "మిమ్మల్నే!... పిలుస్తున్నారు" అని సావిత్రమ్మగారితో చెబితే, అప్పుడు ఆమె వెంటనే లేచి, మాస్టరుగారి దగ్గరకు పోయి నిలబడింది. మాస్టరుగారు ఆమెకు చిన్నప్పటి నుంచి ఏమేమి జరిగాయో అన్నీ పూసగిచ్చినట్లుగా చెప్పి ఉపకారం చెయ్యటంకోసం జీవితాన్నే త్యాగం జేశావ్" అని అంటూంటే, ఈ సంగతులన్నీ మాస్టరుగారికెట్లా తెలిసాయా! అన్న ఆశ్చర్యంతో బాటు దుఃఖంకూడా ఆమెకు ముంచుక వచ్చింది. అది చూచి మాస్టరుగారు" బాధను బైటపెట్టరాదు. కంటనీరు రానీయరాదు. అట్లా చేస్తే కొంతమందికి కష్టం కలుగుతుంది" అన్నారు. ఆ తర్వాత తమ దగ్గిరికి వచ్చిన ఈశ్వరిని చూచి" ఈమె మనస్సులోని తాపం తగ్గాలిగాని ఒక కూల్ డ్రింక్ తెచ్చి ఇవ్వు" అన్నారు. ఆమె కూల్ డ్రింక్ తెచ్చియిస్తే సావిత్రమ్మగారు తాగుతున్నది. అప్పుడు మాస్టరుగారు "హైద్రాబాదులో మీపిల్లల్ని దుష్టశక్తులు పీల్చిపిప్పిచేస్తున్నవి. మీగురువు గారి చేత వాళ్ళకు మీరు చేయించిన మంత్రోపదేశంవల్ల ఆశక్తుల వాళ్ళ ప్రాణాలు తీయలేకపోతున్నవి" అన్నారు. ఆవిడ ఆమాటలు వింటూ మౌనంగా నిలబడ్డది. "ఏమన్నా విషయం మీరు నాకు చెప్పాలను కొంటున్నారా?" అని అడిగారు మాస్టరుగారు ఆమెను. ఆవిడకు ఏం చెప్పాలో స్ఫురించలేదు. ఆమె తటపటాయించటం చూచి "బస్సు బయలు దేరబోతున్నది. త్వరగా చెప్పండి" అని వేగిర పెట్టారు మాస్టరు గారు ఆమెను. కానీ ఆమె తన మనస్సులోని బాధను మాటల ద్వారా మాస్టరు గారి ముందు వెళ్ళగక్క లేకపోయింది.

మాస్టరు గారు పిల్లల విషయం ప్రస్తావించారు కనుక బస్సు హైదరాబాదు చేరిన తర్వాత తప్పక పిల్లలిదగ్గరకు వస్తారని ఆమె సంతృప్తి

పడింది. హైదరాబాదులో బస్సు ఆగగానే బస్సులో ఉన్నవాళ్ళంతా వాళ్ళ వాళ్ళ బంధువులను చూచి వద్దామని బయలు దేరుతున్నారు. సావిత్రమ్మగారు మాస్టరు గారిని చూచి"మా పిల్లలయింట్లో మీరు కాలు పెడితే వాళ్ళ కష్టాలన్నీ తీరిపోతయి. వెళ్ళివద్దాంరండి!" అంది. "ఇప్పుడా! వాళ్ళు ఆశక్తులతో యుద్ధం చేస్తున్నారు. ఆయుద్ధం మధ్యలోనన్నిరికిస్తావా? ఇప్పుడుకాదు" అన్నారు మాస్టరుగారు. ఆమె మాస్టరుగారిని రమ్మని మరీమరీ బ్రతిమాలింది. "వచ్చే టైం ముందుంది. నా అంతట నేనేవస్తాను. ఇప్పుడు కాదు" అన్నారు మాస్టరు గారు.

ఆమె బస్సు దిగి, వెళ్లలేక మాస్టరుగారి దగ్గరకు వచ్చి బస్సు కడ్డీ పట్టుకొని క్రింద నిలబడి, బస్సులో ఉన్న మాస్టరుగారి వంక చూస్తూ "మీరు వస్తారని ఎంతో ఆశ పడ్డాను"అంది. అప్పుడు మాస్టరుగారు "నీవు షిర్డీనుంచి కొబ్బరికాయ తెచ్చావే అది మీ పిల్లల ఇంటికి తీసుకపో! ఇంట్లోకి పోబోయేముందు వేరే కొబ్బరికాయ గుమ్మంముందు కొట్టి కర్పూరం వెలిగించు, షిర్డీ కొబ్బరికాయ దేవుని పీఠంపై పెట్టి అగరు బత్తులు వెలిగించు" అంటూ ఆవిడ వైపు చూచి "ఇంతకూ నువ్వు షిరిడీనుంచి బాబాగారి పటం తీసుకొచ్చావా?" అని ప్రశ్నించారు. ఆమాటవిని ఆవిడ తెల్లమొగంవేసి"లే" దన్నట్లు తలఅడ్డంగా తిప్పింది. తాను షిర్డీ నుంచి కొబ్బరి కాయ తెచ్చిన సంగతి మాస్టరు గారికెట్లా తెలిసిందా? అని ఆశ్చర్యపోయింది. ఇంతలో మాణిక్యమ్మ గారు వచ్చి" ఇవి మీపిల్లలకివ్వండి అని రెండు బాబాగారి మట్టి ప్రతిమలు ఆవిడ చేతిలో పెట్టింది. బాబా ఫోటో తీసుక రాలేదే" అని విచారిస్తున్న సమయంలో బాబా ప్రతిమలు అయాచితంగా తనకు లభించటం చూచి మాస్టరు గారి మహిమకు నిశ్చేష్టురాలైంది.

మాస్టరుగారు చెప్పినట్లు చేసి, ఆరాత్రే తనపిల్లలు లక్ష్మీ,దుర్గలను తీసుకొని బస్సు ఆగినచోటుకు - మాస్టరు గారి దగ్గరకు వచ్చింది. మాస్టరు గారిని చూచి అంతా నమస్కారాలు చేస్తుంటే మాస్టరుగారు సావిత్రమ్మగారి చిన్నమ్మాయి దుర్గ కొడుకు శ్రీ నివాస్‌ను చూచి "మొదట డాక్టరు చూచేది రోగినే" అని ఆ పిల్లవాణ్ణి దగరకు తీసుకొని వొళ్ళో కూచో బెట్టుకొన్నారు. ఆ పిల్లవాడికి లోగడ కొన్నిరోజులనుంచి అనారోగ్యంగా ఉంటున్నది. ఆ విషయం మాస్టరుగారికి తాము చెప్పక పోయినా గ్రహించ గలిగిన ఆ సర్వజ్ఞతకు వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. "పిల్లలందరూ వచ్చి చూచారుగా! ఇప్పుడు మీకు తృప్తిగా ఉందా?" అని సావిత్రమ్మగారి వైపు చూచి

అడిగారు మాస్టరుగారు." వాళ్ళ యింట్లో మిాపాదం పెట్టినప్పుడే నాకు సంతృప్తిగా ఉంటుంది" అంది ఆమె.

ఆమర్నాడు బస్సు భద్రాచలం చేరుకొంది. అంతా గోదావరిలో స్నానం చేసి, స్వామివారి దర్శనార్థం కొండపైకి ఎక్కుతున్నారు. సావిత్రమ్మగారి వెంట ఉన్న మాస్టరుగారు "మామ్మగారూ!" అని ఆమెను పిలిచి "మిాపిల్లలకు వచ్చిన భయంలేదు. అంతా సక్రమంగానే జరుగుతుంది" అన్నారు. ఆమాటలు వినంగానే ఆమెకు గుండెపై నున్న కొండంత బరువు దిగి పోయినట్లైంది. దార్లో ఒకకొట్లో స్వామివారి కోసమని ఒకపూలదండ తీసుకొంది. ఆమె పర్సు ఖాళీ అయింది. ఒక్క పైస గూడాలేదు - అందులో. దేవాలయంలో మాస్టరుగారు సావిత్రమ్మగారికి కూడా తామే టిక్కెట్టు తీసుకొన్నారు.

బస్సుగుంటూరు చేరింది. అంతా మాస్టరుగారికి నమస్కారాలు చేసి, శెలవు తీసుకొని ఎవరిండ్లకు వాళ్ళు పోతున్నారు. మాస్టరు గారు సావిత్రమ్మగారిని చూచి "రేపు మాధూకర్ ఉంది.- మందిరానికి రాండి" అన్నారు. ఆమె ఆరోజు బాపట్ల తిరిగి వెళ్ళింది. మర్నాడు మాణిక్యమ్మగారితో కలసి గుంటూరు వచ్చింది. ఆరాత్రి మాధూకర్. సావిత్రమ్మగారు మాస్టరుగారి గది ప్రక్కనున్న పోర్షన్‌లోకి పోయికూచుంది. ఆ సాయంత్రం మాస్టరుగారు ఆమెను చూచినవ్వుతూ"ఇక్కడ కూచున్నావెందుకు?" డాబామిాద మాధూకర్ జరుగుతున్నది. వెళ్ళు!" అన్నారు. " మాణిక్యమ్మగారు ఇంకా రాలే"దని ఆమె అంటూంటే "ఎవరిప్రాప్తం వాళ్ళది. వెళ్ళండి" అని మాస్టరు గారు ఆమె శిరస్సుపై చెయ్యి పెట్టినిమిరారు.

సావిత్రమ్మగారు ఆరాత్రి అక్కడే ఉంది. మాధూకర్ సమయంలో మాస్టరుగారు అందరికీ షిర్డీ సాయిబాబా, దత్తాత్రేయ స్వామి ఫోటోలున్న క్యాలెండర్లు పంచి పెడుతున్నారు. మాస్టరు గారు తనకు దత్తాత్రేయస్వామి బొమ్మ ఉన్న క్యాలెండరిస్తే బావుండు"నని ఆమె అనుకుంటూంటే మాస్టరు గారు ఆమె దగ్గరికి వచ్చి ఆమె చేతికి ఒక క్యాలెండరిచ్చారు. చూస్తే అది ఆమె కోరుకున్న దత్తాత్రేయుల బొమ్మ ఉన్న క్యాలెండరు!

అంతా మాధూకర్ తీసుకొన్న తర్వాత మూడు విస్తళ్ళు మిగిలాయి. "అందరూ భోంచేశారా?" అని మాస్టరుగారడిగితే "చేశా"రని సమాధానం వచ్చింది. అప్పుడు మాస్టరుగారు డాబా కిందికి దిగివచ్చి, వాకిట్లోకి పోయిచూచారు. వాకిట్లో ఒక ఆవు, కుక్క, మనిషి కనిపించారు. ఆ మూడు

విస్తళ్ళు తెప్పించి వాళ్ళకు పెట్టించారు. రేపు పొద్దున వెళ్ళవచ్చునని సావిత్రమ్మగారిని ఆపి ఆమెచేత ఆరోజు ఆధ్యాత్మిక ఉపన్యాసమిప్పించారు. ఆ ఉపన్యాసంలో ఆమె పూర్వం తమ గురువుగారు తమకు ఉపదేశం చెయ్యడం, దాని ఫలితంగా తనకు కలిగిన దర్శన సాక్షాత్కారాలు మొదలైన వాటిని గురించి మాట్లాడింది. మర్నాడు బాపట్ల వెళ్ళింది.

తర్వాత కొన్నాళ్ళకు హైదరాబాదులో ఉన్న సావిత్రమ్మగారి రెండో కూతురు దుర్గాకామేశ్వరి-తనతల్లితో కలసి మాస్టరు గారి దగ్గరకు వచ్చింది. మాస్టరుగారి పాదాలముందు తాంబూలంలో నూటపదహార్లు పెట్టినమస్కారం చేసింది. అది చూచి "డబ్బునాకెందుకు? ఎందుకు తెచ్చావ్?" అని ఆఅమ్మాయిని మాస్టరుగారు కోప్పడి, "మీ అమ్మకు ఋణపడి ఉన్నావ్. ఈడబ్బుతో ఆమెకు చీరెకొని పెట్టు నాకుకాదు నువ్వు నమస్కారం చేసేది. మీఅమ్మ పటం పెట్టుకొని పూజచెయ్యి!" అన్నారు. "మీ అమ్మనన్ను బస్సులో కలిసి, తలక్రిందలౌతున్న పడవను సరిగా తిప్పింది" అని మాస్టరు గారంటూంటే సావిత్రమ్మగారందుకొని "అట్లా అనకండి. అదంతామీదయ" అంది. తర్వాత మాస్టరుగారి ప్రోత్సాహం వల్ల ఆమె తన తల్లిని హైదరాబాదు తీసుకొని వెళ్ళింది. అక్కడ ఉంటున్నప్పుడు ఒకసారి సావిత్రమ్మగారికి కాలినొప్పి వచ్చింది. డాక్టరుకు చూపిద్దాం రమ్మంటే, ఆమె వప్పుకోక "మాస్టరు గారే దీన్ని నయం చెయ్యాలి" అని పట్టుపట్టింది. ఆ నమ్మకంతోనే ఆమె ఉంటే మర్నాడు పొద్దున షిర్డీ సాయిబాబా మాదిరిగా మెళ్ళో రుద్రాక్షలు ధరించిన ఒకముసలి బ్రాహ్మణుడు వచ్చి, ఆంజనేయస్వామి దండకమున్న పుస్తకమొకటి ఆమె చేతికిచ్చి, "దీన్ని చదవనక్కరలేదు.తలక్రింద పెట్టుకొని పడుకో!" అని ఒక రుద్రాక్షచూపించి "ఇందులో ఏముందో చెప్పు!"అని అడిగాడు. ఆమెకు ఆరుద్రాక్షలో ఒక శివలింగం కనిపించింది. ఆమె మాస్టరు గారికి ఫోన్ చెయ్యమంటే పిల్లలు చేశారు. సావిత్రమ్మగారి కాలి నొప్పి విషయం చెప్పారు. "కొబ్బరినూనె, చిన్న ఉల్లిపాయకోసి బెట్టి, ఆనూనెతో కాలు బాగా రుద్ది స్నానం చేయించండి. తగ్గుతుం"దని మాస్టరుగారు చెప్పారు అంతే. అట్లా చేయగానే ఆనొప్పి తగ్గిపోయింది.

ఆ తర్వాత ఇంకోసారి చెయ్యినొప్పిచేసింది. మాస్టరుగారిచ్చిన విభూతి దగ్గరుంటే అది రాచింది: దాంతో ఆవిడనొప్పికాస్తా ఎగిరి పోయింది. "లక్షలు ఖర్చు పెట్టుకొని, తర్వాత మాస్టరుగారి దగ్గరకు వచ్చి విభూతితో రోగాలు పోగొట్టు కొంటున్నారు." అవి ఒకసారి ఆమె విశ్వమందిరంలో కూచోని ఉన్నప్పుడు ప్రక్కనున్న వాళ్ళతో అంటూంటే అదివిని మాస్టరుగారు

"నా ధ్యేయం-నాగమ్యం-మరువను మరువను ఎన్నటికీ -మరచినడువను ఎన్నటికీ"అనేపాటపాడి "ఈపాటకు అర్థమేమిటి? మీకు ఏమనిపిస్తున్నది- వింటూంటే?" అని సావిత్రమ్మగారిని అడిగితే "నామనస్సు కరిగిపోయింది. వింటూంటే బాధవేస్తున్నది" అంది. మళ్ళీ విభూతి పొట్లాలిన్ని ఆమె ముందు పడవేశారు మాస్టరుగారు.

దత్తజయంతి ఇంకో మండలం రోజులున్నదనంగా మాస్టరుగారు దత్తదీక్ష విశ్వకుటుంబసభ్యులకు ఇవ్వటం పరిపాటి. ఒకసారి సావిత్రమ్మగారు కూడా దీక్షతీసుకొంది. "దీక్షాసమయంలో ఎవరెవరికి ఏయే అనుభవాలు కలిగినవో చెప్పండి"అన్నారు మాస్టరుగారు ఒకరోజు. ఎవరూ మాట్లాడలేదు. మౌనం వహించారు. "సూక్ష్మదర్శినితో పరిశీలిస్తేనేగాని కనిపించ"వన్నారు మాస్టరుగారు. సావిత్రమ్మగారిని తన అనుభవం గురించి చెప్పమంటే, ఆమె"నా అను భవమేమిటో మాటల్లో చెప్పలేను"అని ఆమె మాస్టరుగారి పాదాలు తాకింది. చప్పున కరెంటు షాక్ కొట్టినట్టై - ఆమె చాలా భయపడింది. ఎంతో సేపటికి గాని మామూలు మనిషికాలేదు. విశ్వమందిరంలో పూజాగృహంలో-మాస్టరుగారు పూజచేసి, హారతిచ్చిన తర్వాత అక్షతలు. పూలు మాస్టరుగారి పాదాల మీదచల్లి, ఆపాదాలు ముట్టుకొన్నప్పుడు గూడా ఇట్లాంటి అనుభవమే ఒకసారిగతంలో ఆమెకు కలిగింది. మాస్టరుగారు ఆమెకు కలిగిస్తున్న దివ్యానుభూతుల్ని గురించి చెప్పాలంటే ఒక ఉద్గ్రంధమౌతుంది. మాస్టరుగారిలో రామచంద్రుణ్ణి, శంకరాచార్యులనూ, దత్తాత్రేయుల్ని, లలితాదేవినీ, సాయినాథుని ఇట్లా అనేక దేవతా స్వరూపాలను సందర్శించిన పుణ్యాత్మురాలు సావిత్రమ్మ మామ్మగారు. (సశేషం)

# ఆదిశంకర జన్మభూమి క్షేత్రం-కాలడి

- డాక్టర్ మల్లీప్రియ నాగరాజు

## కాలడి పరిశోధన

*(గత సంచిక తరువాయి)*

3. మొసలి ఘట్టం : క్రోకడిల్ ఘాట్ అంటారు. శంకరుని మొసలి పట్టుకోవటం, ఆయన సన్యసించటం జరిగిన చోటు (పూర్ణనదే).

4. శ్రీకృష్ణాలయం : బాలశంకరులు నదీ గమనాన్ని తమ ఇంటి ముందుకు మార్చినపుడ, ఆర్యాంబ ఇష్టదైవమైన బాలకృష్ణుని ఆలయం మునిగిపోయింది. వెంటనే బాలశంకరులు తమ తపోబలంతో బాలకృష్ణుని విగ్రహాన్ని నదినుంచి పైకి రప్పించి, అక్కడే ఆలయం నిర్మింప చేసారు. శంకరులు స్వయంగా ప్రతిష్టించిన బాలకృష్ణ విగ్రహం, స్వయంగా కట్టించిన ఈ ఆలయం ఎంతో పవిత్రమైనది.

5. శృంగేరీ శారదా మఠం : పూర్ణానది, శ్రీకృష్ణాలయం ప్రక్కనే ఠాగంలో శృంగేరీవారు గొప్ప మఠం నిర్మించారు. వేదపాఠశాల నిర్వహిస్తున్నారు. మూలం తిరునాళ్ రామవర్మ మహారాజు (తిరువాన్కూర్ ప్రభువు) ఎంతో స్థలాన్ని శృంగేరీకి ధారాదత్తం చేసారు. మేనేజర్ హెబ్బార్ సుబ్రమణ్యం, అసిస్టెంట్ రామస్వామి కన్నడిగులు, తమిళం, ఇంగ్లీషు, తెలుగు, మలయాళం, హిందీ అనర్గళంగా మాట్లాడగలరు. యాత్రీకులకు చక్కని వసతి గృహాలు ఉన్నాయి. 1995లో జూన్ 1 నుండి 15 వరకూ నేను ఇక్కడ ఉండే నా పరిశోధన కొనసాగించాను. వీరికి ఇన్ని భాషలు రావటం వల్ల ఏ ప్రాంతం వారైనా శృంగేరీ శారదామఠంలో తమ ఇంట్లో తమ రాష్ట్రంలో ఉన్నట్లే ఆనంద పడతారు.

6. ఆర్యాంబ సమాధి : శృంగేరీ శారదా మఠంలో ఆర్యాంబ సమాధి ఉంది. పూర్ణానది, కృష్ణాలయం ప్రక్కనేగల ఈ స్థలమే శంకరాచార్యుల వారి గృహమనేది నిర్వివాదాంశం. తల్లులకు తల్లి ఆర్యాంబ. శంకరుడు తల్లికి ఎంత ప్రాధాన్యత ఇచ్చాడో, ఆర్యాంబ అతన్ని ఎంత ముద్దుగా పెంచిందో వర్ణించడం కష్టం. ఆర్యాంబ సమాధి చూస్తే ఎవరికైనా తల్లి

విలువ తెలుస్తుంది. 9 నెలలు మోసిన కన్న తల్లి కన్న మిన్న ఎవరూ లేరని, ఉండరని మనం గ్రహిస్తాం. ఇక్కడ నిద్రించిన వారికి ఆమె స్వప్నంలో కనుపిస్తుంది. 6 రోజుల అనంతరం నాకూ దర్శన మిచ్చింది.

7.బ్లాక్ స్టోన్ (Black Stone) : ఆర్యాంబ సమాధి ప్రక్కనే బ్లాక్‌స్టోన్ ఉంది. ఇది శంకరులు స్వయంగా ప్రతిష్ఠించారట. ఈ నల్లరాతి దీప స్తంభం ఎంత అందంగా ఉంటుందో చూసి తీరాల్సిందే 1910 ఫిబ్రవరి 21న 82 ఏళ్ళ క్రితం ఒక వ్యక్తి ఇక్కడ దీపం వెలిగించి, ప్రదక్షిణాలు చేస్తుంటే, శ్రీ సచ్చిదానంద శివాభినవ నరసింహ భారతీ స్వామివారు 33వ శృంగేరీ పీఠాధిపతి కారణం అడిగారు. నేను శంకరాచార్యుల వంశానికి చెందిన వాడిని. ఇది నా ఇల్లు. తరతరాలుగా మేం ఈ దీప స్తంభాన్ని వెలిగిస్తున్నాం అన్నాడాయన. శృంగేరీ స్వామి పరిశోధన ముగిసింది. ఆయన లెక్కకూడా సరిపోయింది. పూర్ణానది, మొసలిఘట్టం, బాలకృష్ణాలయం ప్రక్కగల ఆ స్థలమే శంకరాచార్యుల గృహమని తీర్మానించి, వెంటనే అక్కడ శృంగేరీ మఠం నిర్మించారు. మూలం తిరునాళ్ రామవర్మ ప్రభువు కొన్ని వందల ఎకరాల ఆస్థలాన్ని శృంగేరీ వారికి దానం చేసారు. ఈ ప్రాంతంలో గల ఇళ్ళు, కొట్లు, హోటల్స్ అన్నింటి అద్దెలు శృంగేరీ పీఠానికే వస్తాయి నేడు. దాంతో ఎన్నో మంచి పనులు చేస్తున్నారు.

8. వేదపాఠశాల : ఋగ్వేద విద్యార్థులకు ఉచిత భోజన, వసతితో ఉచిత విద్య 6 సంవత్సరాల కోర్సుఉంది. విద్యార్థుల కిచ్చేది పరమ సాత్వికాహారం, ఉదయం నిమ్మకాయ పచ్చడి, ఉప్పుతో గంజి ఇస్తారు. రెండు పూటలా భోజనంలో సాంబార్, తప్పనిసరిగా మెంతి మజ్జిగ (పసుపు వేసి తిరగమూతపెట్టి మజ్జిగ), అందులోనే కూర కలుపుతారు, చారు, మజ్జిగ, సాయంత్రం కషాయం (పాలలో ధనియాలు, మెంతులు, జీలకర్ర మొదలైనవి కల్సిన కషాయం.) ఈ ఆహారం, రెండు పూటలా పూర్ణానది స్నానం ౧౫ రోజులలో నాకు పూర్ణారోగ్యాన్నిచ్చింది. పప్పు అసలు లేదు. నిమ్మకాయ పచ్చడి, మెంతిమజ్జిగ, కంపల్సరీ. పప్పు చాలా చెడ్డదని "Personal experience is greater than book's knowledge" అని నేను గ్రహించాను. సంస్కృత విద్యార్థులు తినే ఈ ఆహారాన్ని అందరూ తిని, రోజూ నదీస్నానం చేస్తే రోగాలేరావని చెప్పాలి. ఈ ఉత్తమాహారం ముందు నా ఆయుర్వేద ప్రకృతివైద్య గ్రంథ పరిజ్ఞానం ఎందుకూ పనికి రాలేదు. మీరూ ఈ ఆహారాన్ని కాస్త చూడండి. అయితే పండ్లు ఇస్తారు. అప్పుడప్పుడు పాలు ఇస్తారు. మజ్జిగబాగా ఇస్తారు.

9. శంకరాచార్య బ్రిడ్జి : పూర్ణానదిపై కమనీయంగా కట్టారు.

10. శ్రీశంకరాచార్య యూనివర్సిటీ ఆఫ్ సాంస్క్రిట్ : 1993లో ప్రారంభింపబడిన ఈ సంస్కృత విశ్వవిద్యాలయానికి ఇప్పుడిప్పుడే సొంత భవనాలు సమకూరుతున్నాయి. ఎం.ఏ. లెవెల్లో జరిగే సంస్కృత డిగ్రీలతో మహోన్నత స్థితికి వచ్చి తీరుతుంది. యం. రామన్‌కుట్టిమేనోన్, ఉమ్మర్ రిజిస్ట్రార్స్.

11. శ్రీరామకృష్ణ అద్వైతాశ్రమం : కోట్ల పెట్టుబడితో శ్రీరామకృష్ణ మఠం వారు కాలడిలో దీన్ని నిర్మించారు. ఆడిటోరియం, వివిధ భాషల గ్రంథాలతో కూడిన గ్రంథాలయం, పుస్తక విక్రయశాల (తెలుగు గ్రంథాలు ఉన్నాయి). ఉచిత వైద్యశాల, శ్రీరామకృష్ణ హైస్కూల్, ధ్యానానికి పెద్ద హాలు శ్రీ రామకృష్ణ మిషన్ వారు చాలా గొప్పగా దీన్ని నిర్వహిస్తున్నారు. దీనిని గత 20 ఏళ్ళుగా ఎంతో అభివృద్ధి చేసిన, చేస్తున్న శ్రీ స్వామి గణానంద నాకు పరమాప్తులు. 1993లో తమ రామకృష్ణమిషన్ వ్యాన్‌లో నన్ను పెరుంబాపూర్‌లో దించి, పళంతోట్టం మార్గం చూపారు. ఈ ఆశ్రమంలో వారం రోజులు ఆతిథ్యం ఇచ్చారు.

12. కాప్పిల్లిమన : శంకరుని తల్లి మరణించినప్పుడు వచ్చి, శవం కాళ్ళవద్దనిల్చిన నంబూద్రి కుటుంబం. ఈ ఇల్లు కాలడిలో శృంగేరీ మఠానికి కొంచెం దూరంలో పూర్ణా ఆడిటోరియంకు ఎదురుగా ఉంది. ప్రస్తుత పెద్ద దామోదరన్ నంబూద్రిని నేను కలిసాను. దక్షిణాఫ్రికా నుంచి వచ్చిన ఆయన కుమారుడు కూడా నంబూద్రి సంప్రదాయాలు వివరించారు.

13. తలయేత్తుం పిల్లిమన : ఆర్యాంబ మరణించగానే వచ్చి తలవద్ద నిల్చిన కుటుంబం. ఈ రెండు కుటుంబాలు తప్ప శంకరుల ఇంటికిరాని మిగతా ఆ కుటుంబాలు అప్పుడే నాశనమయ్యాయి. ఈ రెండు కుటుంబాలు నేటికీ ధనవంతులుగానే ఉన్నారు. ఈ తలయేత్తుం పిల్లిమన కాలడి సెంటర్‌లో ఉదయాహోటల్ ప్రక్కనేగల నాగార్జున ఆయుర్వేదిక్ ఏజన్సీ యజమానులది. 8 ఎకరాల స్థలం, 10 భవనాలు, కుటుంబ పెద్ద, 76 ఏళ్ళ పరమేశ్వరన్ నంబూద్రి నన్ను కౌగలించుకొన్నారు. ఇన్నేళ్లకు కాలడి గూర్చి ఒకవ్యక్తి పరిశోధన చేస్తున్నందుకు తమ ప్రత్యేక పూజామందిరం చూపారు.

**14.** అంబట్టువీడు : ఆర్యాంబ మరణించినప్పుడు "కాప్పిల్లిమన" "తలయేత్తుంపిల్లి మన" - రెండు నంబూద్రి బ్రాహ్మణ కుటుంబాలే వచ్చాయి. శంకరులు కత్తి కావాలన్నారు. కత్తిని నాయర్ కుటుంబీకులు ఇచ్చారు. (ఆంధ్రలో కమ్మ, రెడ్డిలతో సమానమైన కులం "నాయర్' వర్ణం). శంకరులు ఆకత్తితో తల్లి శవాన్ని ముక్కలుగా కోసి, దొడ్డిలో అరటి ఆకులపై ఉంచి, యోగాగ్నిచే దగ్ధం చేసారు. ఆయనకు కత్తి నిచ్చిన ఇల్లే "అంబట్టు వీడు", ఇది కాలడిలో ఎలక్ట్రిసిటీ ఆఫీసు వద్ద 'శ్రీరామకృష్ణ అద్వైతాశ్రమరోడ్''లో కొంచెం మలుపు తిరిగితే కనిపిస్తుంది. అవాకరన్ పిళ్ళై దీని యజమాని. వీరిదే "త్రివేణి" అనే మరో "అంబట్టువీడు" ఆ ప్రక్కనే ఉంది. యువ దంపతులు లత, సతీష్, వారి పాప కీర్తి నాకెంతో ఆప్తులయ్యారు. ఆ ప్రక్కయిల్లే ప్రఖ్యాత మలయాళ అభ్యుదయకవి మన్యప్పర ఉన్నికృష్ణన్‌ది. ఆయన భార్య లత, పిల్లలు మీరాకృష్ణ, సూర్యకృష్ణన్ - వీరితో రోజూ రాత్రి 10 గంటలదాకా గడిపే వాడిని. మన్యప్పర ఉన్నికృష్ణన్ అప్పుడే నా తెలుగు రచనలను మలయాళంలోకి అనువదిస్తున్నారు. అతడి మలయాళ కవితలు, కథలు నేను తెలుగు చేస్తాను. మా సాహితీ స్నేహం నా జీవితాంతం సాగుతుంది. (నేనే పెద్ద గనుక నా జీవితాంతం అన్నాడు. ఆయన చిన్నవాడే -స్నేహానికి వయసుతో పనిలేదు. నా కన్న 30 ఏళ్ళు పెద్దయిన బి.యన్ రెడ్డిగారు, 40 ఏళ్ళు పెద్దయిన దేవులపల్లి వారు నాకు ఆప్తులైనట్లే. ఈనాడు మన్యప్పర ఉన్నికృష్ణన్ చిన్నవాడైనా కవితాస్నేహం కలిపాడు.)

**15.** అంబాడత్తు : అయితే శంకరాచార్య యూనివర్సిటీ ప్రొఫెసర్ నాకు మరో విషయం చెప్పారు. ఆయన దృష్టిలో "అంబట్టువీడు" కాలడిలోది కాదు. నేను **1995** జూన్ 13న ఘోరమైన వర్షంలో సాయంత్రం కాలడికి 7 కిమీ. దూరంలోగల పారక్కుళం (మన్యప్పర వేళ్ళేదారిలో) చేరాను. అక్కడ "అంబాడత్తు" ఉంది. భాస్కరమేనోన్ (75), తంగప్పమేనోన్ (79) వృద్ధ సోదరులు ఆతిథ్యం ఇచ్చారు. వారికి అక్కడే మరో ఇల్లు కూడా ఉంది. శంకరాచార్యులకు కత్తి ఇచ్చిన కుటుంబం తమదేనని ఈ వృద్ధులు చెప్తున్నారు. మహాపండితులు, సంస్కృత, మలయాళ భాషలలో 40 గ్రంథాలు వ్రాసి, ఇప్పుడు 84వుట "శంకరోదంతం" సంస్కృత గ్రంథం వ్రాస్తున్న 'పండితరత్న' 'ఉత్తమ ఉపాధ్యాయ బహుమతి' గ్రహీత శ్రీ ఎ. శంకరశర్మ నా సందేహాన్ని పటాపంచలు చేసారు.

(సశేషం)

